గజానన గ్రంధమాల 10వ కుసుమము.

# ఆశీస్సు

స్థిరలక్ష్మీవిశద ప్రభావితుడు నై
సిద్ధేశ్వరస్వామి స
త్కారుణన్ మీలోక ధర్మశాల వసతిన్
గట్టించి పోషించి యు
ర్వర సత్కీర్తి వి గాంచుచుంటుటలు మీ
భాగ్యంబు; బాగంటి భా
వ్కరలింగా. కౌముదీ చిరాయువును వి
శ్వశ్రేయ సంప్రాప్తికై ॥

ఓం.

శ్రీశివాభ్యాంనమః

# సిద్ధేశ్వర సుప్రభాత స్తోత్రమ్.





చాగంటి భాస్కరలింగశాస్త్రిగారిచే

ప్రకటితము:

వరంగల్.

974

వెల: ఒక రూపాయి.

29.5.53

# తొలిపలుకు.

సకల చరాచర ప్రపంచమునకు మూలము స్తుతి గీత, నృత్య పూజాది కర్మములచేగాని మానవ శరీరంబునకు ఐహిక విముక్తి కాదు ఆముష్మికానందము. అనుభవైక వేద్యము గాన ముఖ్యముగా సిద్ధేశ్వరుని చరిత్రమును గురించి విపులీకరించుట ముఖ్యమని యెంచి సిద్ధేశ్వరుని కాలము చరిత్రకారులు ఇదమిద్ధమని నిర్ణయించలేకున్నారు.

పౌరాణిక యుగమునాటి స్వయంభూస్వామి యనుటలో నిస్సందేహము. సిద్ధినొసగు హనుమద్గిరి సిద్ధేశ్వరుడని ప్రతీతి.

పార్వతీ పరమేశ్వరులు కైలాసమందున కుమారస్వామి జననాంతరము తారకాసుర సంహారణానంతరము ఆనంద పరవశులైయుండ శాండిల్యా శాతాతపాది మహర్షులు మహేశ్వరా! నీవు యెల్లకాలంబు ఇచ్చటనేయుండ మానవలోకమున మనుజులు సమస్త భోగభాగ్య పిపాసాయత్త చిత్తులైయుండ వారిని కడతేర్చుట ఎట్లు! నీ అనుగ్రహములేనిదే అయ్యది దుస్సాధ్యము.

మహాత్మా! మమ్ముల సంతుష్టిచేయుటకు భూలోకంబున నీవు స్వయంభూస్వామివై వెలయుమని ప్రార్థించ భక్తాభీష్ట ఫలప్రదుండగు పరమేశ్వరుడు వల్లెయని హిడింబాశ్రమమున పరమ పవిత్రంబగు క్షేత్రరాజంబుగ విరాజిల్లుటకును ప్రశాంతముగ తపమాచరించుటకు అనుకూలమగు స్థలమున నేను సిద్ధేశ్వరుడను పేరుతో అవతరించెదనన, వారు

యారాధించునట్లును సూర్యచంద్రాదులుకూడపూజించినట్లును దేవతలెందరో పూజించి తమ అభీష్టములు వడిసినట్లు పురాణకథలు గలవు.

స్కాందమహాపురాణమున ఉపరిభాగమున సిద్ధేశ్వర ఖండమున్నదని చెప్పుదురు. అందలి విషయములే నాకు తెలిసినంత వరకూ పొందుపరిచితిని. ఈ సిద్ధేశ్వరుని యొక్క దేవాలయము కాకతీయాంధ్రరాజుల పరిపాలనాకాలమున ప్రాంగణములు పెంపొందినవి. ప్రసిద్ధికెక్కినవి. సిద్ధేశ్వర పద్మాక్షి అనుగ్రహముచేతనే వారు అహర్నిశములు ఆరాధించుటచేతనే ప్రతాపరుద్రాది చక్రవర్తులు రాజ్యమేలినట్లు కానవచ్చుచున్నది. ఈ చరిత్ర కొందరు ప్రకటించిరి కానీ కవికాలము కవితాశైలి కాకతీయుల పరిపాలనా సౌరక్ష్యము విమర్శించిరిగాని సిద్ధేశ్వరుని పూర్వచరిత్ర పౌరాణికయుగము చెప్పియుండలేదు. ఇంకను ఈ సిద్ధేశ్వర పద్మాక్షీ మహాత్మ్యములకు కాకతీయ రాజుల చరిత్ర కొంత దోహదము. ఇప్పటికిని కొందరు చరిత్రకారులు విమర్శించుచునే యున్నారు. అవి కూడ లభించిన కొలది కాలములో శాసనబద్ధమగు చరిత్రకూడా ప్రకటించుటకు ముద్రించుటకు ప్రయత్నింతును.

ఈ మహోన్నతమగు సిద్ధేశ్వరస్వామివారి గుండమునందు స్నానము, వారికి ఆరాధన పద్మాక్షిదేవికి పూజలు, కాళేశ్వరము పాలాస మంతెన, ధర్మపురి మొదలగు గ్రామములనుండి వేదవిదులైన బ్రాహ్మణోత్తములు వేతెంతురు. కాకతీయుల కాలమునగూడ సిద్ధేశ్వరార్చనలు జరుపుటకును కొన్ని అగ్రహారము లిచ్చిరట. షట్స్థల పరబ్రహ్మవేదియగు మల్లికార్జున పండితారాధ్యుల కొడిమేల రాజాయారాధ్యులవారు ఈ క్షేత్రమున తపముచేసి సిద్ధిపొందిరట. ఇటీవల తాటికొండ పూర్ణయ్య శాస్త్రిగారు ఈ క్షేత్రమున తపమాచరించి సంతానసమృద్ధికలిగినవెనక శివసాయుజ్యము జెందిరి. కొడిమేల రాజయారాధ్యులవారి పౌత్రులు బసవా

రాధ్యులవారు, వారి కుమారుడు శైవ ప్రచారిణి పత్రికాధిపతులు. రాజలింగారాధ్యులవారు ప్రతి సంవత్సరము కార్తీకమాస గణార్చన 36 రోజులు పూర్తిగాగానే మార్గశిర శుక్ల షష్టిలు సిద్ధేశ్వరాలయమున శత రుద్రీయ లక్ష బిల్వార్చనలు జరిపిమ హేశ్వరార్చన జరుపుచుండెడివారు. పరాభవ నామ సంవత్సరములో రాజలింగారాధ్యవారు శివసాయుజ్యము చెందినప్పటి నుంచి ప్లవంగ మార్గశిర మారథ్య అర్చనాదివిధులు నేను ఆచరించుచున్నాను. కీ॥ శే. చందాకాంతయ్య శ్రేష్టిగారు కొంతకాలము క్రిందట నొక సిద్ధునకు ఆశ్రమమునేర్పరిచి తపస్సుచేయించిరి గాండ్ల రాజమౌళికి కవితాధార పూర్తిగా కల్గినది. మరియు ఈ సిద్ధేశ్వరస్వామివారి ధర్మశాల ఇటీవల పూర్తిగా శిధిలమైపోయినది. శిఖరముపోయినది ఇవి అన్నియు చూచి నాకు ఈ ధర్మశాల నిర్వహణము చేయించవలెనని కుతూహలము కలిగినది దేవస్థానమునకు రోడ్డు కూడ వరంగల్ మొదటి చైర్మన్ టి. హయగ్రీవాచారిగారి కాలమున వేయబడినది. సుమారు 25 సం॥ములు గతించినవి. రోడ్డు మరీ జీర్ణమైనది. పునరుద్ధరించవలెనని ప్రయత్నము జరుగుచున్నది. ఈ ధర్మశాల నిర్మాణము పూర్తిఅయి సిమెంటు స్లాపు పూర్తి అయినది. శిఖర ప్రతిష్ఠ అయినది. కరెంటు లైట్ ఫిటింగ్ శ్రీ చవాన్ లక్ష్మీనారాయణగారు చేయించిరి ధర్మశాల నిర్మాణములో శ్రీ నూకా ఆగయ్య శ్రేష్టిగారు రాత్రింబగళ్లు శ్రమపడిరి. వారి కృషి మిక్కిలి ప్రశంశాపాత్రము. ఇంకా అస్త్రకారి, గిలాబ్, షాబాదిబండలు కొంత వరకు వెనుక రూములు గుండము పూడిక మొదలగు పనులు ఎన్నియో కావలసియున్నవి, దాతలు ఎందరో కలరు. వారి అభీష్టములు ఈ సిద్ధేశ్వర దేవాలయ ప్రాంగణ ధర్మశాలలకై ఉపయోగింపబడుగాక। ఈ సిద్ధేశ్వరుని సుప్రభాతము రచించిన శ్రీ ముదిగొండ మల్లికార్జున శాస్త్రిగారు వరంగల్ నగర వాస్తవ్యులు, శివపూజా దురంధరులు, ఉభయ భాషలయందు అనర్గళమగు పాండిత్యము గలవారు వారిని నేను సిద్ధేశ్వర

సుప్రభాతము వ్రాయుమని కోరగనే అనుగ్రహించి వ్రాసి యిచ్చిరి నేను ముద్రించితిని వ్యవధిలేకుండుటయు కాగితము ధర మిన్నంటుటయు. అటులనే అన్ని ధరలు పెరుగుటచే తాత్పర్యము ముద్రించలేదు శ్రీ మల్లికార్జున శాస్త్రిగారికి నేనెంతయో ఋణపడితిని. సిద్ధేశ్వరానుగ్రహము వారియందు పరిపూర్ణముగా ప్రజ్వరిల్లుగాక!

ఈ సిద్ధేశ్వరస్వామివారి దక్షిణవైపు నూతనముగా పునరుద్ధరించ బడిన యజ్ఞశాలను ధర్మశాల జమా ఖర్చులు. విరాళము లొసంగిన దాతల నామములు త్వరలో ప్రకటించగలను ఇంకా కావలసిన పనులకు ప్రస్తుత ప్రపంచావస్థలు గుర్తెరిగి దాతలు ఈ ధర్మకార్యములకు సిద్ధులగుదురని కోరుచున్నాను.

వరంగల్.
10-9-74

సిద్ధేశ్వర భక్తుడు.
చాగంటి భాస్కర లింగశాస్త్రి

శ్రీ శివాయగురవే నమః



శ్రీ చాగంటి భాస్కరలింగశాస్త్రిగారు,
శ్రీమతి చాగంటి పాపమ్మగారు, వరంగల్.

ఓం.

శ్రీశివాభ్యాంనమః

# సిద్ధేశ్వర సుప్రభాత స్తోత్రమ్.

శ్లో॥ శుద్ధాయబుద్ధాయ తథైవనిత్యం ।
ముక్తాయ సిద్ధాయ తథేశ్వరాయ ।
ఏవం భవాన్యై భవ వామగాయై ।
భూయాంసి మేసంతు నమాంసి నిత్యం ॥ 1

లిఙ్గేసుషుప్తిరితి వేదగిరావిరుక్తం ।
దబ్రహ్మస్వరూపమిదమేవ భవత్స్వరూపం ।
భక్త్యేష్టదాన మహితం హితసర్వవాదౌ ।
సిద్ధేశ్వరాక్షరపతే! తవ సుప్రభాతం ॥ 2

సచ్చిత్సుఖంతదధ నిత్యమసస్తమాద్యం ।
జ్యోతిః పరంపరమకారణ మాత్మరూపం ।
బ్రహ్మైవలిఙ్గమితి నిశ్చితమాగమాన్తైః ।
సిద్ధేశ్వరాక్షరపతే! తవ సుప్రభాతం ॥ 3

బ్రధ్నేందు పావకతటిద్ప్ర ముఖాఽఖిలాగ్ర్య ।
తేజోఽవభాసక! కుతస్తవ సుప్రభాతం? ।
సంభోక్ష్యమాణ నిఖిలార్థ సమర్పణంవా ।
సిద్ధేశ్వరాక్షరపతే! తవ సుప్రభాతం ॥ 4

శ్లో॥ జ్ఞానక్రియా బలపదా సమవాయినీ తే ।
చిచ్ఛక్తిరేక పరమాద్ద్వివిధంను విశ్వం ।
తద్యోగతశ్శివః విశిష్ట ఇతీర్యసేత్వం ।
సిద్ధేశ్వరాక్షరపతే! తవ సుప్రభాతం ॥ 5

వాతాహతి ప్రవిచలచ్ఛక పత్రపత్ర ।
వారింబిందు చంచలమిదం నిఖిలంహి విశ్వం ।
త్వత్సంగతైవ సుకృతిస్సకలాస్థిరాస్యాత్ ।
సిద్ధేశ్వరాక్షరపతే తవ సుప్రభాతం ॥ 6

సృష్టిస్థితీతదుపసంహృతితత్తిరోధీ ।
తేషామనుగ్రహ ఇతిప్రథితాః క్రియాస్తే ।
ప్రఖ్యాపయంతి మహతీం విభుతామసాధ్యాః ।
సిద్ధేశ్వరాక్షరపతే! తవ సుప్రభాతం ॥ 7

స్వాతంత్ర్యమవ్యయ సుఖాఽనుభవః ప్రబోధోఽ ।
నాదిస్నిజశ్చ సకలోఽమితశక్తిమత్త్వం ।
అక్షయ్యశక్తి కలితత్వమితి స్వధర్మాః ।
సిద్ధేశ్వరాక్షరపతే! తవ సుప్రభాతం ॥ 8

త్వత్తోఽధికోఽపిచ సమోనహిదృశ్యతేకోఽ ।
ప్యస్మాపచేఽత్ర జగతి ప్రభురద్వితీయః ।
తస్మాదశేషజనతా ప్రథితస్త్వ మాపీః ।
సిద్ధేశ్వరాక్షరపతే! తవ సుప్రభాతం ॥ 9

సిద్ధాదిదేవ నివహైస్సతతార్చితత్వాత్ ।
సిద్ధత్వతస్త్వయ మిహా పిచనామతత్తే ।

సిద్ధోఽపవావిపనకశ్చిదపీశ! సత్యం ।
సిద్ధేశ్వరాక్షరపతే! తవ సుప్రభాతం ॥ 10

ఆత్మేష్టు జీవహృదయాంబుజపేటికేచ ।
క్షేత్రే చరాఽచర గుణౌనయనాదికేఽపి ।
వ్యక్తిం పరాం భగవతశ్శ్రుతయోవదంతి ।
సిద్ధేశ్వరాక్షరపతే! తవ సుప్రభాతం ॥ 11

ఆత్మీయ శక్త్యమృతపాన విశేషతృప్తః ।
త్వంనాస్తి తస్యధిపతేః కరణీయమన్యత్ ।
భావత్ప్రకృత్య మఖిలంభజమానముక్త్యై ।
సిద్ధేశ్వరాక్షరపతే! తవ సుప్రభాతం ॥ 12

అప్రాకృతాన్యఘ జరామృతి శోకముఖ్య ।
దోషప్రపంగరహితాని శివ! స్థిరాణి ।
లీలాకృతాని పరమేశ! వపూంషి తేస్యుః ।
సిద్ధేశ్వరాక్షరపతే! తవ సుప్రభాతం ॥ 13

మృత్యోర్భవాచ్చవితరాంచకితా జనాస్తే ।
మృత్యుంజయం తమభవం భవ! తం భవంతం ।
హిత్వాప్రయాంతి కృపణాశ్శరణం కమన్యం ।
సిద్ధేశ్వరాక్షరపతే! తవ సుప్రభాతం ॥ 14

త్వద్భాసవాతి చరణేన గుణాష్టకం తత్ ।
సంకల్ప తస్తతిరోహితమేవ జైవం ।
తద్భావనానుచరణం భవతస్సపర్యా ।
సిద్ధేశ్వరాక్షరపతే! తవ సుప్రభాతం ॥ 15

ఆనందకానన విభిన్నసుమాఽప్రయత్న ।
వీర్యాన్మధు ద్రవవిపాన విశిష్టలీలః ।
ఓంకార ప. చ్ఛి.దధిగాన పవిత్రగాత్ర! ।
సిద్ధేశ్వరాక్షరపతే! తవ సుప్రభాతం ॥ 16

జ్ఞానాదుపాసన పదాభిహితాద ఖండాత్ ।
ఇష్టాదిలిఙ్గ విహితాన్ననుతే స్వరూపం ।
దృష్టం హృదిప్రవితరత్యథముక్తిమంతే ।
సిద్ధేశ్వరాక్షరపతే! తవ సుప్రభాతం ॥ 17

కర్మేంధనైధిత భవాఖ్య దవాగ్నితాప ।
తప్తానరశ్చిరమమీ సుఖినోభవేయుః ।
ఆనంద సౌదరససాంద్ర కటాక్షదృష్టాః ।
సిద్ధేశ్వరాక్షరపతే! తవ సుప్రభాతం ॥ 18

సృష్టేః పురావిగత రాత్రి దినాదిభేదే ।
శూన్యే సతిత్వ సతిచాఽసతి సత్వమేకః ।
ప్రజ్ఞానసార భవతస్స వితుర్వరేణ్యాత్ ।
సిద్ధేశ్వరాక్షరపతే! తవ సుప్రభాతం ॥ 19

మాయా పరాప్రకృతి రిత్యభిధీయతేసా ।
మాయీ భవానపితయా సహితశ్శివోఽసి ।
వ్యాప్తం చరాఽచరమిదం భవతోః ప్రతీకైః ।
సిద్ధేశ్వరాక్షరపతే! తవ సుప్రభాతం ॥ 20

రుద్రోగ్రశర్వ భవభీమమహేశ ముఖ్యైః ।
ఏవం పశోఃపతి రితిశ్రుతిషు ప్రసిద్ధైః ।

అర్ఘ్యాభిరష్టభిరభీష్ట ఫలప్రదోఽసి ।
సిద్ధేశ్వరాక్షరపతే! తవ సుప్రభాతం ॥ 21

గంగాది దివ్యతటినీస్థిత భవ్యతీర్థ ।
సంభావ్య సర్వగుణ సంభృతమంభసీవ ।
కుండేతవాత్ర మహితే హిలమస్తి శంభో: ।
సిద్ధేశ్వరాక్షరపతే: తవ సుప్రభాతం ॥ 22

ధర్మాభివర్ధనశివైకనిబద్ధ బుద్ధేః ।
శ్రీకాకతీయవరదేవ పరంపరాయాః ।
సర్వప్రకార పరిరక్షణగీతకీర్తే ।
సిద్ధేశ్వరాక్షరపతే: తవ సుప్రభాతం ॥ 23

సస్త్రావనాయ రజతాచల మందిరాత్స్వాత్ ।
అత్రాహనామతి భవాన సుపస్థితంతాం ।
ఆత్మేచ్ఛయైవ కృతవాని తి తేకృపాఽహో ।
సిద్ధేశ్వరాక్షరపతే: తవ సుప్రభాతం ॥ 24

వృత్తైర్వసంతతిలకై శ్రుతిసార గర్భైః ।
ప్రాభాతికీవిరచితాశివ! తేసపర్యా ।
భక్తేరదభ్ర సుఖినోఽసిముదేతవస్తాత్ ।
సిద్ధేశ్వరాక్షరపతే: తవ సుప్రభాతం ॥ 25

తారాపతీస్తుతిమయీ హమమద్గిరేశ్రీ ।
సిద్ధేశ్వరస్య లసతశ్రుతిగీత కీర్తేః ।
నిత్యోపయోగ సుఖితోఽభతాంజనౌఘాన్ ।
సిద్ధేశ్వరాక్షరపతే! తవ సుప్రభాతం ॥ 26

విద్యేశః భూతవిషహోధిపతేః మహేశః ।
బ్రహ్మాన్ః సదాశివః విరించపతేః శివాఖ్యః ।
భద్రంసదాభవతు మంగళమస్తు నిత్యం ।
సిద్ధేశ్వరాక్షరపతే! తవ సుప్రభాతం ॥ 27

సిద్ధేశ్వరార్ధవ పృషిస్థితి మత్యదారే! ।
సిద్ధిప్రదాయిని! పరే! జగతాంశరణ్యే! ।
తత్త్వప్రబోధిని! పరాఽపర మిశ్రరూపే! ।
చిచ్ఛక్తి పార్వతిః శివే! తవ సుప్రభాతం ॥

భావప్రాణేష్టభేదేన । భక్తానుగ్రహకారిణే ।
పరబ్రహ్మ స్వరూపాయ । సిద్ధలింగాయతే నమః ॥

---

ఓం.

# శ్రీ పద్మాక్షీ స్తోత్ర పఞ్చకమ్

శ్లో॥ స్వంరూపం బహుధావిధాయ సకలే కార్యాత్మనాయాస్థితా ।
యాచైకా పరిహృత్యభేదమఖిలం బీజాత్మనాఽవస్థితా ।
సర్గాద్యంకృతి పఞ్చకంభజతి తద్యస్యావశేతాంసదా ।
పద్మాక్షీం హమమద్గిరిస్థ్రనిలయాం వన్దేపరాందేవతాం ॥

ఆనన్దం పరిపూర్ణమేవ మమలాం సత్తాం చిదంచోజ్జ్వలాం ।
యస్యారూపముశన్తివైదిక గిరస్సర్వాస్తథైవాగమాః ।
శక్త్యాకార పరాఽపరాత్మ కలితాం సర్వేశ్వరీంతాంసదా ।
పద్మాక్షీం హమమద్గిరింద్రనిలయాం వన్దేపరాందేవతాం ॥

హోతవ్యా భవసిన్ధు మగ్నమనుజైః పాతాత్మకైకాహియా ।
ధ్యాతవ్యాధతథావిధైః ప్రతికలంచాన్యాదయారూపిణీ ।
మాయాజాదిపద ప్రసిద్ధవిభవాంతాం ద్విస్వభావాంసదా ।
పద్మాక్షీం హనుమద్గిరీన్ద్రనిలయాం వన్దే పరాందేవతాం ॥

జ్యోత్స్నాచంద్రమివప్రభేవ తపనం యాచన్ద్ర మౌళింసదా ।
సంగమ్యైవ చరాఽచరాత్మక జగత్పురాదితం తన్యతే ।
శ్రీకంఠాదపరత్ర సర్వవిషయే సర్వస్వతంత్రాంహితాం ।
పద్మాక్షీం హనుమద్గిరీన్ద్ర నిలయాం వన్దే పరాందేవతాం ॥

భక్తాభీష్టఫలప్రదాం భగవతీం బ్రహ్మాదిభిస్సంస్తుతాం ।
భావాఽభావవివర్జితాం భవభయ పోత్రాత్పారిణీంతారిణీం ।
భూతేశార్ధశరీర భద్ర వపతింభవ్యాం భవానీంసదా ।
పద్మాక్షీం హనుమద్గిరీన్ద్రనిలయాం వన్దే పరాందేవతాం ॥

# ప్రస్తావన.

భక్తాగ్రేసరులారా !

సర్వజీవులకును పూర్వజన్మలయందొనరించిన మహాపరాధములకు భగవంతునిచే కఠిన శిక్షగ నీయబడిన యీ సంసారమొక కారాగారము. ఇందు ప్రతి జీవునకును కోట్లకొలది జన్మ పరంపరలనుండి సంచితమగు కర్మపుంజము మహామహా పర్వతములకంటెను మించియున్నది. అందు పరిపక్వములగు కొన్ని కర్మలను మాత్రము గ్రహించి వర్తమాన శరీరము సృజించబడినది. అందును మానవశరీరము పుణ్యపాప సామ్యమున లభించినది. ఇట్లు సంచితమునుండి ప్రారబ్ధరూపమున కొన్ని కర్మలును. తపో, జపాది ప్రాయశ్చిత్తముల (ఫైన్ చెల్లించుట)తో కొన్ని కర్మలును పోయినప్పటికిని సంచితశేషము పుష్కలముగనున్నది. తిరిగి దానియందు వర్తమాన శరీరారబ్ధమగు నాగామి కర్మయుచేరి దానిని మరింత వృద్ధి చేయుచున్నది.

ఇట్లు కర్మ మహాసముద్రము దరిదాపులేనిదై దుస్తరమగుచున్నది. చేసిన తప్పులకు యథోచిత శిక్షల ననుభవింపవలెనన్నచో నిక జీవున కేనాటికిని మోక్షప్రసంగమే యుండదు. కనుక "దాసుని తప్పులు దండముతో చెల్లు" అనునట్లు నిరంతర శివపూజ నమస్కారాదులతో గాక వేరు దారిలేదు ఆ శివపూజ బాహ్యాభ్యంతర భేదముచే రెండు విధములు. అందు బాహ్య పూజకు పుష్కలమగు పూజా సామాగ్రి కావలెను. ఆంతర (మానస) పూజకు కేవలము ఈ ప్పితార్థభావనమే ముఖ్యము. ఆ భావనకు అనుకూల శబ్ద సందర్భము వలయును శబ్దముమ పలుమారు ఉచ్చరించుట

తోడనే తదీయార్థస్మృతికలిగి భావనాదార్ఢ్య మేర్పడును కనుకనే శ్రీరుద్ర మంత్ర, శివగీతాదులను నిత్యము పారాయణము గావింతురు. భావన స్థిర పడినచో భక్తునకు పశుత్వముతొలగి శివత్వము ప్రాప్తించును. భావన కింతటి మహాప్రభావము కలదు చూడుడు! జీలకర్ర, అల్లము మున్నగు వేర్వేరు వస్తువులను అనేక పర్యాయములు నిమ్మరసములో భావన చేసిన యెడల కొంతకాలమా వస్తువులన్నింటికి నిజస్వగుణములుపోయి కేవలము నిమ్మరసము దగు పులుపే సుస్థిరమగును. కాముకునకు కామినీ భావనతో సర్వత్ర కామినీ సాక్షాత్కారము కలుగును

భావనాదార్ఢ్యమును కలిగించెడి యీశబ్ద సందర్భము వైదిక మంత్ర రాశియగుచో సత్తమాధికారులగు కొందరకు మాత్రమే రుచిగానుండెడి కొన్ని (పరిమిత) సమయములలోనే యుపయోగించును. అయ్యది లౌకిక మగుచో స్త్రీ, పురుష, బాల, వృద్ధాది సర్వాధికారులకును సర్వావస్థల యందును ఉపయోగపడును. ఈ యుద్దేశముతోడనే వివిధ స్తోత్రరాశి యుద్భవిల్లినది. అందు సుప్రభాత స్తోత్రము మిక్కిలి ముఖ్యము. ఏలన జీవుని సంసార ప్రవృత్తి ప్రభాతమునుండియే ప్రారంభమగునుగదా! మనకు జీవితాంతము మరుపురాకుండ నుండవలసిన పాఠములను ఉషః కాలముననే చదువుదుముగదా! అట్లు అన్నిటికంటెను ముఖ్యాతిముఖ్యుడగు ఈశ్వరుడు మరపునకు రాక యనుక్షణము జ్ఞాపకముండుటకై తదీయ స్తోత్రపాఠము ప్రాతఃకాలమున చేయుటయే మిక్కిలి ఫలదాయకము. సాంసారిక భోగము ఈశ్వరుని క్షణ క్షణమున మరపించుచుండును. ఆ యీశ్వరుని మరచినచో మన సర్వకార్యములును వ్యర్థములే. ఈ సుప్రభాత స్తోత్రము మనఃప్రసాదముగల ప్రాతఃకాలమున చేయునదగుటచే సర్వకాల సర్వావస్థలయందును భగవంతుని తలపునకు తెచ్చుచు మోక్షము నీయజాలును.

ఇందలి ప్రతి పద్యమునందును "నమః, తే, అస్తు" అను పదములు అధ్యాహార్యములు. శ్రుతిభగవతియగు వేదమాతకూడ "నమస్తే రుద్ర" ఇత్యాదిగ నమస్కారము చేయక శివనామము నుచ్చరించకున్నచో నిక మనమాట చెప్పనేల? కాగా శక్తిత్రిగుణ విశిష్టుడవగునో సిద్ధేశ్వరా! నీకు నమస్కారము. ఈ సుప్రభాతము నీయదియేయని యర్థము. నిద్రనుండి మేలుకొనుటతోడనే యిట్టి శుభచింతనము ప్రకృతి పాశబద్ధుడై ఆనంద గ్రస్తుడగు జీవున కావశ్యకము. కాని సర్వస్వతంత్రుడగుటచే ప్రకృతిని వశీకరించుకొని కాలకర్మాది దోషములకు దూరముగనుండెడి యీశ్వరునకు గాదు. ఐనను తానుభవింపబోయెడి సుప్రభాతమును తదితర భక్ష్య భోజ్యాదులవలె నీశ్వరార్పణముగానెంచి యనుభవించుటయే దీని తాత్పర్యము. శంకరాచార్యులవారుగూడ "యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనం" అని తాజేసెడిది పనులన్నింటిని నీశ్వరార్పణము జేయుటకై స్వాహంకారమును పరిహరించి యివియన్నియు నీవేయనెనుకాక నేను అని అన్నను ఆచార్య నీలకంఠులు "అహంపదార్థాయ" అనుచో నహం పదమునకు ముఖ్యార్థ మీశ్వరుడేయని సిద్ధాంతీకరించెను. అచేతనమగు దేహమున జీవుడు ప్రధానమైనట్లు అస్వతంత్రుడగు జీవునకును అంతర్యామి యగుటచే శివుడు ప్రధానుడు. కనుక మనమెల్లప్పుడును ఆతని యాజ్ఞారూపములగు వేదశాస్త్ర వచనముల ప్రకార మాతని సేవించుట యొప్పు. వాని నతిక్రమించి స్వేచ్ఛగ చరించుట తప్పు. దీనికి ప్రతిక్రియ తిరిగి భక్తిశ్రద్ధలతో నీశ్వరుని నుతించుటయే.

ఇతి,

ముదిగొండ మల్లికార్జునశాస్త్రి,
గిర్మాజిపేట, వరంగల్.

ఓం

# శ్రీ ఓరుగంటి సిద్ధేశ్వరాలయ చరిత్ర

ఆంధ్ర సామ్రాజ్యము నేలిన మహారాజులలో కాకతీయులు అగ్రగణ్యులు వారికి మొదట కొంతకాలము అనుమకొండ రాజధానిగ నుండినది తరువాత ఓరుగల్లు రాజధానిగ మారినది. బేతరాజు, ప్రోలరాజుల కాలమునకూడ అనుమకొండయే రాజధానిగానుండినది. గణపతిదేవ చక్రవర్తి చాలకాలము హనుమకొండ నుండియే రాజ్యము చేసినట్లు శా. శ. 1174 నాటి ఒక శాసనమును బట్టి తెలియుచున్నది. శా. శ. 1176 వ సంవత్సరము నందలి మరియొక శాసనమునుబట్టి గణపతిదేవుడు ఓరుగల్లున ఉండి రాజ్యపాలన చేయుచున్నట్లు తెలియుచున్నది. కనుక గణపతిదేవుడు 1174–76లకు సరియగు క్రీ. శ. 1252–54ల నడుమ రాజధానిని ఓరుగల్లుకు మార్చినట్లు స్పష్టమగుచున్నది.

కాకతీయుల పౌరుష ప్రతాపములు, శిల్పకళా వైభవములు, విద్యావివేకములు జగద్విదితములైనవి.

కాకతీయుల శిల్పకళా వైదుష్యమునకు తార్కాణములుగ ఓరుగల్లులో సహస్రస్తంభ దేవాలయము. పద్మాక్షీ సిద్ధేశ్వరుల ఆలయము. స్వయంభూ దేవాలయము, రామప్పగుడి, (ఓరుగల్లుకోట) మొదలగునవి నేటికిని నిలచియున్నవి

అనుమకొండకు హనుమాద్రి, హనుమద్గిరి, హనుమకొండ అను నామాంతరములు కలవు.

పాత్రుడైన హిమవంతుని వలన మేనకాదేవికి కుమార్తెయై జన్మించి, పార్వతియైనది దినదినాభివృద్ధినొంది. సంప్రాప్త యౌవనయైన ఆ పార్వతి శివుని భర్తగా కోరినది. తండ్రి అందుకంగీకరించి ఈశ్వరుని ప్రార్థించుటకై మేరుమందర వింధ్యాది మిత్ర బాంధవులను రావించి, అనురూపమైన కామరూపములు ధరించి ఆయనకడకేగి, తమ పూనిక తెలుపగా అందుకు ఈశ్వరు డంగీకరించెను. అనంతరము గురు శుక్రులు పార్వతీ పరమేశ్వరుల వివాహంబునకు శుభ ముహూర్తమును నిర్ణయించి, హిమవంతున కెరింగించిరి. మేనకాదేవి పార్వతిని మణిహారంబులతో సలంకరించెను. హిమవంతుని ఆజ్ఞచే విశ్వకర్మ నిర్మించిన మణిమయ పట్టణంబున ఈశ్వర నామ సంవత్సర కార్తీక శుద్ధ నవమి సోమవారము రాత్రి ధనుర్లగ్నమున పార్వతీ పరమేశ్వరులకు వైభవముగా వివాహము జరిగినది. బృహస్పతి మంత్రహోమాదులను నిర్వహించెను రంభాది దేవాంగనలు నాట్యంబు చేసిరి. గంధర్వులు గానము చేసిరి. పెండ్లికి వచ్చిన పెద్దలు అందరు పెండ్లి కట్నములు చదివించిరి. అనంతరము అప్పగింతలు జరిగెను. నాటినుండి ఈశ్వరుడు అర్ధనారీశ్వరుడైనాడు ఇట్టి ఓ పార్వతీ! నీవు ఇప్పుడు పద్మాక్షి అనుపేర వెచ్చేసి సిద్ధేశ్వరునకు పడమటి శిఖరిపై నిలువ వేడుచున్నారము'' అని విన్నవించుకొనిరి. పార్వతీ పరమేశ్వరులు కరుణతో ప్రమధులను జూచి ''సరే, మేము ఉచితాకృతులను ధరించి అట్లే ఉందుము. మీరందరూ అక్కడ భక్తజనులై యుండుడు'' అనిరి. అనంతరము ఈశ్వరుడు సిద్ధేశ్వరుడయ్యెను. ఒప్పులకుప్పయగు పార్వతి పద్మాక్షి అయ్యెను. ప్రమధులు భక్తులైరి. వారందరును ఒక శుభముహూర్తమున హనుమాద్రికి దక్షిణ దిశను ఒక సరస్తీరంబున దిగిని దుండి. దుర్గాది క్షేత్రపాలకులు కూడ వారితో దిగిరి. ఆ ప్రదేశము సిద్ధాశ్రమమైనది అట్టి వెంచేసిన పద్మాక్షి సిద్ధేశ్వరులు నాటినుండియు భక్తుల ఈప్సితముల నెరవేర్చుచుండిరి. వారిని పూజచేసిన విద్యార్థులకు సకల

సకల విద్యలు నబ్బును. అక్షరలక్షలు పూజచేసినవారికి అక్షయపదవులు లభించును. పుత్త్రార్థులగువారు పుత్త్రుల బడయుదురు.

కాకతీయ వంశపు మహారాజులందరూ ఈ పద్మాక్షీ సిద్ధేశ్వరులను సేవించి తరించినారు. కాకతీయ రాజులలో ప్రప్రథముడని చెప్పబడుచున్న మాధవవర్మ ఇందుకు ప్రబల నిదర్శనము. ఆయన వృత్తాంతమును గూర్చి ఈ కథ ప్రచారములో నున్నది.

చంద్రవంశజుడగు సోమదేవరాజు కందారమును రాజధానిగా చేసుకొని వైభవోపేతముగ రాజ్యము చేయుచుండెను. ఆ సమయమున కటకపురాధీశ్వరుడైన బల్లిహుడను రాజు కందారముపై దండెత్తివచ్చెను. సోమదేవుడు వానిని ఎదిరించి వెళ్లగొట్టెను. బల్లిహుడు మరల దండెత్తి వచ్చెను. ఒక యుద్ధములో సోమదేవుడు మరణించెను. ఆ సమయమున సోమదేవుని భార్యయగు సిరియాలదేవి గర్భవతిగా నుండెను. శత్రురాజు శౌర్యమునకు భయపడి ఆమె కందారమునువిడచి పోయెను. అనుమకొండ చేరి, అక్కడ ఉండిన మాధవవర్మయను బ్రాహ్మణోత్తమునుచేరి, అతని పాదములపైబడి శరణు వేడెను. షట్కర్మ నిరతుడు, దాయాదాక్షిణ్య శీలుడు అయిన మాధవశర్మ అమ్మా! నీవిచ్చట నిర్భయముగా నుండుము. సిద్ధేశ్వరుడు నీకు శుభముల నిచ్చుగాక!" అని ఆశీర్వదించి ఆమెకు ఆశ్రయమిచ్చెను. మాధవవర్మ చేసిన ఈ పనికి అచ్చటి నూరిండ్ల బ్రాహ్మణులును ఆమోదించి, ఆ విషయమును రహస్యముగా నుంచుటకు నిశ్చయించుకొనిరి. సిరియాలదేవి ఆయన ఇంట సుఖంబుగా నుండెను.

బల్లిహుడు కందారంబు నాక్రమించి రాణిని వెదికించెను. సిరియాలదేవి కనపడలేదు. అట్లు వెదుకుచు ఆయన అనుమకొండకువచ్చి అచ్చటి ఇండ్లను గాలింపసాగెను తుదకు మాధవశర్మ ఇంటిలో సిరియాల

దేవినిచూచి గుర్తించెను. కాని మాధవశర్మ, ఆమె తన కుమార్తెయనియు, ఆమె భర్త కాశీకి వెళ్లుటచే ఆమె తనవద్ద నున్నదనియు వాదించెను. కాని కటకరాజు అది నమ్మక ఆమెను కొనిపోవ నిశ్చయించుకొనెను. అట్లు చేసినచో తాను చత్తునని మాధవశర్మ గోలచేసెను. అచ్చటి బ్రహ్మణులను మాధవశర్మకు బాసటగానిలిచి వారును అగ్ని ప్రవేశము చేయుటకు సిద్ధమైరి. ఆ గగ్గోలునకు బల్లహుడు భయపడి "అయ్యా! ఈమె బ్రహ్మణ కన్యయైనచో సిద్ధేశ్వరుని సన్నిధిలో, ఈమె చేతి యన్నమును మీరు భుజింపుడనెను. అట్లేయని బ్రాహ్మణులు సిద్ధేశ్వరుని సన్నిధిలో సిరియాల దేవి వడ్డించగా అది సిద్ధేశ్వరుని ప్రసాదమనుచు ఆదరంబుతో భుజించిరి. కటకరాజు సిరియాలదేవిని బ్రాహ్మణుల కప్పగించి వెడలిపోయెను సిరియాలదేవి సుఖముగా నుండి ఒక శుభముహూర్తమున ఒక బాలుని కనెను. తనను రక్షించిన మాధవశర్మ పట్లగల కృతజ్ఞతాభావముతో ఆమె తన కుమారునకు మాధవవర్మయని పేరిడెను ఆ బాలుడు ఎనిదవయేటనే రాజగునని బ్రాహ్మణోత్తములు పలికిరి.

మాధవవర్మ బాల్యము అద్భుత కథాభరితమైనది ఎనిమిదవయేట అతడు పద్మాక్షిదేవి ఆలయములో చదువుకొనుచుండెడివాడు ఒకనాటి సాయంకాలము మాధవవర్మ బయట ఆటలాడుకొనుచు. పుస్తకములను పలకను గుడిలో మరచిపోయెను. ఇంటికి పోయిన తరువాత జ్ఞాపకము రాగా, ఎవ్వరికినీ చెప్పకుండ. ఒంటరిగా ఆ రాత్రివేళ గుట్టయెక్కి పద్మాక్షి గుడిలోనికి పోయెను. అప్పుడచ్చట అతి భయంకర దృశ్యమొకటి అతని కగుపించెను భూతప్రేత పిశాచ శాకినీ ఢాకినీశ్యాది భూత పరివారముతో పద్మాక్షిదేవి కొలువుతీర్చియుండెను మాధవవర్మ ఏమాత్రమును భయపడక భూతకోటులను తొలగుడని అదిరించి, పలక పుస్తకములను తీసుకొని పోబోను పద్మాక్షీదేవి అతని చెయ్యి పట్టుకొనెను ఆమె చేతిని విడిపించుకొని మాధవవర్మ పోజూచెను. అప్పుడు ఆమె బహు భయంకర రూపము

వాల్చెను కాని అతడు ఏమాత్రము భయపడక ఆమెకు మ్రొక్కెను. అతని ధైర్య శౌర్యములకు ఆమె మెచ్చుకొని కావలసిన వరము కోరుకొమనెను. అప్పుడాతడు తన తండ్రిని జయించిన కటక బల్లహుని జయింపగల వరబలశక్తినిమ్మని ఆమెను వేడుకొనెను. ఆమె సరేయని చెప్పి, ఖడ్గఖేటకములనిచ్చి ఇవి నీచేతనుండగా నీకే ఎల్లప్పుడును జయములు కలుగును. నీ శత్రువులందరూ నీకు భయపడి నీ పాదాక్రాంతులై యుందురు వాని సహాయమున 'ద్విసహస్రమాసంబులు' రాజ్యమేలుదువని చెప్పెను అనంతరము పశ్చిమ దిశనున్న ఒకానొక రహస్య బిలమునుచూపి దానిగుండా పోయినచో చతురంగబల సమేతమైన సేనవచ్చి కలియునని చెప్పెను అంతేకాక ఆ ఖడ్గఖేటకములు వారివద్ద వేయిసంత్సరములుండుననియు. వాని సహాయమున వేదవిదులైన బ్రాహ్మణులను, గోవులను, సాధువులను, ఆర్తులను కాపాడుమనియు, మహేశ్వరుని పరమప్రేమతో సేవింపుమనియు చెప్పి ఆతని వీడుకొలిపెను. ఆ ప్రకారముగా మాధవవర్మ బిలము వెడలిపోవ ప్రయత్నించగా అనేక క్రూరసర్పములు, భూతప్రేత రాక్షసులు ఆయనను ఎదిరించినవి కాని అతడు భయపడక ముందుకు సాగిపోగా, అచ్చట ఆయనకు అరువదివేల భద్రగజములు, నాల్గు లక్షల అశ్వములును, పదునేడు లక్షల కాల్బలమును, మణిహార భూషితులైన ఏడుకోట్ల గణికలును, వజీర్లును, సరదారులును వచ్చి జోహారొనర్పగా వారిని వెంటనిడుకొని మాధవవర్మ ఆనందముతో అనుమకొండకు వచ్చెను. వారి సహాయమున మాధవవర్మ బల్లహుని చంపి, తన రాజ్యమును తిరిగి సంపాదించుకొనెను. కొంతకాలమునకు పద్మాక్షీ దేవి వరప్రసాదమున అతనికొక కుమారుడు కలుగగా ఆ దేవిపైగల భక్తి ప్రపత్తులచే అతనికి పద్మసేనుడని పేరిడెను. మాధవవర్మ 160 సం॥లు రాజ్యమేలెనట.

ఒక్క మాధవవర్మయేకాక కాకతీయవంశ రాజులలో పలువురు

రాజన్యులు ఈ పద్మాక్షీ సిద్ధేశ్వరుల అనుగ్రహములను సంపాదించినట్లు తెలియుచున్నది.

మాధవవర్మ కుమారుడైన పద్మసేనుడు పద్మాక్షీదేవిని ఆరాధించుచు చాలకాలము రాజ్యమేలెనట. కాని అతనికి సంతానప్రాప్తిలేమిచే, విబుధుల అనుమతిన సిద్ధేశుని కూష్మాండఫలములచే నర్చించి ఆయన వరప్రసాదమున ఒక కుమారుని గాంచెను. అతని పేరు ప్రోలమరాజు. ఆతనుకూడ అనూచానముగ సిద్ధేశ్వరుని పూజించియే ఒక కుమారుని పొందెను. అతని పేరు పోరంకి ప్రోలమరాజు. అతడును సంతానప్రాప్తికై మణులు, రత్నములు, మాణిక్యములు మొదలగునవి సిద్ధేశ్వరుని మండపమున విక్షేపించి, ఆణిముత్యంబులచే ముగ్గు పెట్టించి, సిద్ధేశ్వరుని అనుగ్రహమునకు పాత్రుడై, జ్ఞాన పారీణుడగు సుతుని గాంచెనట. కాకతీయులలో ప్రసిద్ధురాలైన రుద్రమదేవి మీదికి దేవగిరిరాజు దండెత్తిరాగా ఆమె సిద్ధేశ్వరుని సహస్రదళములతో పూజించి, పద్మాక్షీదేవికి నిత్యమహోత్సవంబు చేయించి, విప్రజనంబులకు సమారాధనలు చేయించి, తత్ఫలితముగా శత్రురాజును వెనకకు త్రిప్పికొట్టెను. రణరంగ ధురంధరుడైన కుమారుని బడయుటకై ఆమె సిద్ధేశ్వరుని నిత్యము సువర్ణపద్మ సహస్రముతో నర్చించెడిది. అంతేకాక ఆ దేవాలయమున నిత్యోత్సవము జాతర మొదలగునవి జరుపుటకు రెండువేల మాడలు దయచేసినదట! ఏర్పాట్లు కావించినదట. ఈ కాకతీయులలో కడపటివాడైన ప్రతాపరుద్రుని రాజ్యకాలమునాటికి పద్మాక్షీ సిద్ధేశ్వరుల అనుగ్రహము వారిపట్ల సన్నగిల్లినట్లు తెలియుచున్నది. నాటికి పద్మాక్షీదేవి ఇచ్చిన సహస్రవత్సర రాజ్యకాల పరిమితి పూర్తి అయిపోయినది ప్రతాపరుద్రునిచే ఏడుమార్లు ఓడింపబడిన ఢిల్లీ సుల్తాన్ చివరకు సంధిచేసికొనెను ఆ సమయమున స్వయంభూ దేవాలయపు పూజార్లు వచ్చి స్పర్శవేది లింగ మహాత్మ్యము క్షీణించినదని తెలిపిరి. అది విని ప్రతాపరుద్రుడు వెరగుపడి, దేవతాప్రసాదంబు తనకు

తొలగిపోయినది ఎఱిగి, సిద్ధేశ్వరుని ఆలయమునకేగి, పద్మాక్షీ దేవిని పూజించి, అద్దేవి పూర్వదత్తంబులైన ఖడ్గఖేటకములను ఆమె సన్నిధాన మున నుంచి నమస్కరించెను. వెంటనే ఖడ్గము సర్పాకారమై పద్మాక్షీ దేవి వదన గహ్వరమున దూరిపోయెను. ఖేటకము అమ్మవారికి అంగరాగమున మారిపోయినది. అది చూచి శివదేవయ్య. శాఖవల్లి మల్లికార్జునాది పెద్దలు తొల్లి మాధవవర్మకు పద్మాక్షీదేవి వరమొసగిన సహస్రవర్ష రాజ్యకాల పరమితి నాటికి తీరిపోయినదని వివరించిరి. ప్రతాపరుద్రుడు చింతా క్రాంతుడై, ఇక మానుషశక్తియేకాని. తొల్లిటి దైవశక్తిలేదని యెఱిగి విజనివాసమునకు తిరిగిపోయెను అనంతరము వుల్లుఖానుతో జరిగిన ఘోరయుద్ధమున, రుధిరోద్గారి సంవంత్సర ఆశ్వీయుజ బహుళ విదియా గురువారమునాడు ప్రతాపరుద్రుడు పట్టుబడెను. అంతటితో కాకతీయ సామ్రాజ్యమంతరించినది. ఈ విధముగా పద్మాక్షీదేవి వరప్రసాదమున 15 మంది రాజులు వేయి సంవత్సరములు ఓరుగల్లు నేలిరి

పద్మాక్షీదేవి ఆలయము ఒక కొండమీద గలదు. కొండక్రింద పద్మాక్షీ గుండమను నొక కోనేరున్నది. దాని ప్రక్కనుండి కొండపైకి మెట్లు గలవు. ఆలయ గోపురము జైన పద్ధతి ననుసరించి మెట్లు మెట్లుగ కట్టబడి యున్నది. ఆలయమునందు దేవత ద్విజభుజయై పద్మాసనాసీనయై యున్నది. ఈమయే ప్రకృతమున పద్మాక్షీదేవిగా పూజింపబడుచున్నది.

కాకతీయుల కాలములో బౌద్ధ, జైన మతములు ప్రబలంబుగా నుండినవి. ఇందుకు నిదర్శనములుగా పద్మాక్షీ దేవాలయము వద్ద కొన్ని జైన విగ్రహములుగలవు. వీటినిబట్టి ఈ దేవాయము మొదట జైనులచేత కట్టింపబడినదిగా చారిత్రకులు చెప్పుచున్నారు. ఈ ఆలయములోని దేవత జైన పురాణగాథలలో వర్ణింపబడిన ఇరువది నల్గురు శాసన మహాదేవు లలో నొక్కతేయై యుండవలయుననియు, ఆమె ఇరువది రెండవ

తీర్థంకరుని శాసన దేవతయైన అంబిక అనబడుచున్నది దుర్గయొక్క ప్రతి రూపమనియు భావింపబడుచున్నది. కాకతి ప్రోలరాజు వేయించిన ఆ శాసనములోని—

"శ్రీమజ్జినేంద్ర పదపద్మమశేష భవ్యం
నవ్యత్రిలోక నృపతీంద్రమునీంద్ర వంద్యం
నిశ్శేషదోష పరిఖండన చండకాండం
రత్నత్రయ ప్రభవమద్య గుణైకతానం"

అను మొట్టమొదటి శ్లోకము దినేంద్రస్తుతినిబట్టి ప్రోలరాజు జైన మతావలంబకుడని అనిపించుచున్నది. కాని ప్రోలరాజు కుమారుడైన రుద్రదేవుడు "శివపాదపద్మయుగళ ధ్యానామృతానందు" డని (రుద్రదేవుని) అనుమకొండ శాసనములోని—

"తత్పుత్రః శివపాదపద్మయుగళ ధ్యానామృతానంద భూ
ద్గంతాకో రిపు సుందరీజనమహా సౌభాగ్య సంపచ్ఛ్రియః
ప్రోలీరాజ ఇతి ప్రసిద్ధమగు మద్వైరీంద్ర దర్పాపహో
నిశ్శంక ప్రధన ప్రబంధనమహాహుంకారలంకేశ్వరంః"

అను శ్లోకమునుబట్టి ప్రోలరాజు శివభక్తుడేమో అనుపించుచున్నది. ఈ రెంటినీబట్టి పరిశీలించగా ప్రోలరాజు ముందు జైనుడైనను వార్ధక దశయందు శైవుడై యుండవచ్చునని అనిపించుచున్నది.

అయితే పద్మాక్షీదేవి ఆలయములోని జైనస్తుతి ప్రోలరాజులది కాదు. ఆతని మంత్రి భార్యయగు మైలమాంబది. ఆమె పుట్టింటివారును, భర్తయు జైనులని పద్మాక్షి ఆలయ స్తంభముమీది శాసనమునుబట్టి తెలియుచున్నది.

ఆలయమంప కత్తరమున రెండు శిలలు కలవు. వానిలో మొదటి

దానిపై నొక జైన విగ్రహమును, తచ్ఛిరోపరిభాగము నందొక విస్తృత సప్తముఖ నాగమును గలవు. ఇది 23వ తీర్థంకరుడగు పార్శ్వనాదుని విగ్రహము కావచ్చును. ఈ శిల్పమునకు ప్రక్కన పత్నీసమేతుడైన ఒక ధ్యాన విగ్రహము కలదు బహుశః వీరిరువురును మంత్రి బేతనయు, ఆతని భార్య మైలాంబయు అయి ఉండనోపు!

గణపతి దేవుని కాలమున తిక్కన సోమయాజి యేతెంచి ఆయనకు భారతాఖ్యానమును వినిపించి, వైదిక మతము సర్వోత్కృష్టమైనదని వివరింపగా, గణపతి దేవుడు ప్రీతుడై ఆయా మతములలో వాదన సమర్థులైన పండితులను రావించి, వాదోపవాదములు చేయించి, ఓడిపోయిన జైన బౌద్ధమతాచార్యులను నతికించెననియు, ముప్పదియారు జైన ముని వనితలను కూలద్రోయించి వాటి స్థానమున పెక్కు శివాలయములను కట్టించెననియు శ్రీ సిద్దేశ్వర చరిత్రమున చెప్పబడినది. దీనిని బట్టి గణపతిదేవుని రాజ్యకాలమున జైన బౌద్ధములు పూర్తిగా అంతరించినవని తెలియు చున్నది.

ఈ విధముగా నున్న ఇచటి శాసనములను, స్థానిక చరిత్రములను పరిశీలించగా, ఈ దేవాలయములు, జైన విగ్రహములు తరువాత కట్టబడినవనియు, శ్రీ పద్మాక్షి సిద్ధేశ్వరుల విగ్రహములు అనాదినుంచి యున్నవనియు తోచుచున్నది. ఈ ఊహ సరియైనదైనచో ఇచ్చటి విగ్రహములు మొదట వైదిక దేవతలైన పద్మాక్షి సిద్ధేశ్వరులవే యనియు, ప్రోలరాజు కాలమున జైన మతము ఉచ్ఛదశయందుండుటచే అక్కడి దేవాలయములు జైన విధానములో కట్టబడినవనియు, కాలాంతరమున జైనము క్షీణింపగా తిరిగి ఆ దేవాలయము వైదిక బ్రాహ్మణుల చేతులలో పడి పూర్వస్థితి వందినవనియు చెప్పవచ్చును. ఇందుకు కొన్ని నిదర్శనలు కనిపించు చున్నవి. దేవాలయములలో పద్మాక్షి దేవియని చెప్పబడు

విగ్రహమునకు చేతులలో శైవ విగ్రహములకు ఉండవలసిన సర్వఛత్ర హంసాది చిహ్నములు లేకపోవుట ఇందుకు ప్రబలమైన నిదర్శనము.

అంతేకాక, స్కాంద మహాపురాణములోని ఉపరిభాగమున సనత్కుమార సంహితలో ఒక ప్రసిద్ధ పౌరాణిక కథ కలదు. చాలమంది దేవతలు సిద్ధేశ్వరుని అనుగ్రహము బడసి ముక్తులైరని చెప్పబడినది. శాండిల్య శాతాతపాది మహర్షులు చాలకాలము తపస్సు చేయగా పరమేశ్వరుడు వారిని అనుగ్రహించి ఇచ్చట సిద్ధేశ్వరుడై స్వయంభువుడై వెలసినట్లును, పార్వతి పద్మాక్షియై వెలసినట్లును. దేవతలు సువర్ణవృష్టి కురిపించిరనియు అందే కలదు. ఈ గాధలనుబట్టి పద్మాక్షీ సిద్ధేశ్వరులు ఈ హనుమాద్రిపై కొన్నివేల సంవత్సరముల క్రితము అవతరించినట్లు తెలియుచున్నది.

అంతేకాక శ్రీ కట్టి చిః బసవశాస్త్రిగారు కన్నడమున రచించిన "బసవ విజయము"న రేవణ సిద్ధుడగు రేణుకాచార్యుడు ఈ సిద్ధేశ్వరుని సన్నిధానమున తపము చేసినట్లు గలదు. ఈ రేణుకాచార్యుడు క్రీ. పూ. 3 వేల సంవత్సరమునాటి వాడని తెలియుచున్నది. కనుక ఇది సిద్ధేశ్వరుని ప్రాచీనతకు మరొక ప్రబల నిదర్శనము

అర్వాచీనులలో ప్రసిద్ధుడైన శ్రీ సుంకరనేని ఫణికుండలుడు రచించిన "కోడిమేల రాజేశ్వర శతకము"లో శ్రీ కోడిమేల రాజయ్యగారు సిద్ధేశ్వరుని వద్ద తపస్సుచేసి సిద్ధిపొందినట్లు చెప్పబడుచున్నది.

"శ్రీ సిద్ధేశ్వర భజన కీర్తనలు" అను పుస్తకమును రచించిన శ్రీ గాండ్ల రాజమౌళి యను కవీశ్వరుడు తాను "హనుమద్గిరి పద్మాక్షీ సిద్ధేశ్వర వరప్రసాదలబ్ధ కవితా దురందరుడని" చెప్పుకొన్నాడు. ఆయన "హనుమద్గిరి సిద్ధేశ్వర శతకము"ను రచించినాడు. శ్రీ రాజమౌళిగారు

మొదట పూర్తిగా చదువురానివారట. కాని సిద్ధేశ్వరునియందు అపార భక్తి ప్రపత్తులు కలవారట. ఆయన 21 రోజులు ఘోరమైన తపస్సు చేయగా సిద్ధేశ్వరుడు ప్రత్యక్షమై ఆయన నోటిలో బీజాక్షరములు వ్రాయగా, శ్రీ రాజమౌళిగారు కవితా దురంధరులైరట !

మహాతపస్సంపన్నులైన శ్రీ కొడిమేల రాజయారాధ్యుల మనుమలు శ్రీ బసవారాధ్యులవారు అఖండ గణార్చనలు, శూన్యసింహాసన నిర్మాణమును కావించి తరించెను. ఆయన కుమారులు శ్రీ కొడిమేల రాజలింగారాధ్యులవారును చాలకాలము శ్రీ సిద్ధేశ్వరుని ఆరాధించినవారే ! క్రీ. శ. శ్రీ రాజలింగారాధ్యులవారు ఓరుగల్లులో శైవ పంచాననీ గ్రంథ మాలను, పత్రికను, సంస్కృత కళాశాలను స్థాపించి, అశేషమైన భాషా సేవచేసి వారు పరాభవ (క్రీ. శ. 1966) సంవత్సరము వరకును శతరుద్రీయ లక్ష బిల్వార్చనలు, శ్రీ సిద్ధేశ్వరునకు ప్రతి సంవత్సరము మార్గశిర శుద్ధ షష్ఠినాడు జరిపించి, 36 దినముల కార్తికమాస గణార్చనాంతము పూర్తియైన వెనుక, మహేశ్వరార్చనలతో సిద్ధేశ్వరాలయ ప్రాంగణమునపగటి భోజనము చేసెడివారట.

ప్లవంగనామ సంవత్సరమునుంచి నేటివరకును శ్రీ రాజలింగారాధ్యులవారి అల్లుడు శ్రీ చాగంటి భాస్కరలింగ శాస్త్రిగారు, మామగారివలెనే ప్రతి సంవత్సరమును మార్గశిర శుద్ధ షష్ఠినాడు శతరుద్రీయ లక్ష బిల్వార్చనలతో మహేశ్వరార్చనము చేయుచున్నారు.

ఈ నాటికినీ ఈ సిద్ధేశ్వరుని ఆలయమున కొన్ని ప్రత్యక్ష నిదర్శనములు కనిపించుచున్నవి. ప్రతినిత్యమూ నిశిరాత్రి 12 గంటల నుండి 2 గంటల వరకును దేవతలు శ్రీ సిద్ధేశ్వరుని ఆరాధింతురట. దానిని దేవపూజా సమయమందురు. అందుచే ప్రణవ నాదము వినబడుచుండును.

ఆ సమయమున సామాన్య మానవులు ఆరాధించుటకు అలవికాదు ఆ దేవ పూజా సమయమున పరమ తపస్సంపన్నులైన శ్రీ జగద్గురు కంచి కామ కోటి పీఠాధిపతులు శ్రీ చంద్రశేఖర సరస్వతీ స్వాములవారు సిద్ధేశ్వరుని ఆరాధించినారట।

ఇటీవల ఈ దేవాలయమునకు దక్షిణ భాగమున గల ధర్మశాల పూర్తిగా శిథిలమైపోగా, కీ॥ శే॥ శ్రీ చందా కాంతయ్య శ్రేష్ఠిగారు రేకు లతో ఒక వసారావేసి, ఒక సిద్ధునిచే తపస్సు చేయించిరి. తరుశాత ఆ వసతులు కూడ పూర్తిగా జీర్ణమైపోయి నిలువనీడ కూడ లేనిస్థితిలో నుండుటచే దానిని ఉద్ధరించవలెనను కుతూహలముతో శ్రీ వాగంటి భాస్కరలింగశాస్త్రిగారు ఆ ధర్మశాలను యజ్ఞశాల అను పేరుతో పునరుద్ధ రణ గావించిరి. ఈ నిర్మాణంలో శ్రీ నూకా అగయ్య శ్రేష్ఠిగారు చాల శ్రమపడినందుకు. కరీమాబాద ముదిగొండ నందికేశ్వరుడుగారు కూడ ప్రశంసాపాత్రులు. ఇంకను జరుగవలసిన పనులు ఎన్నియో ఉన్నవి. దాతలు, ధనికవర్గము ఈ సిద్ధేశ్వరాలయ ప్రాంగణమున గుండము పూడిక ధర్మశాలలు కట్టించి, గురుకుల వాసముగ నేర్పరతురని. శ్రీ పద్మాక్షీ సిద్ధేశ్వరుల అనుగ్రహమున సకల యశస్కాములై వర్ధిల్లుదురు గాకయని శ్రీ పద్మాక్షీ సిద్ధేశ్వరులను ప్రార్థించుచున్నాను.

ఈ గ్రంథ ముద్రించిన సరస్వతీ ముద్రాక్షరశాలవారికి సిద్ధేశ్వరులు భోగభాగ్యాదుల నిచ్చుగాక.

శ్రీ హరి శివకుమార్, M. A. P, Hd.

# పద్మాక్షీ అనుగ్రహాష్టకమ్



శ్రీ విద్యా నవరత్నరమ్య శిఖరాం శ్రీ సిద్ధనాథ ప్రియాం
ప్రావృట్కాలపయోద నీలవపుషాం భద్రాను భావ్యాం పరాం
ధీమత్ సత్కవితా ప్రదానకరుణాం దీవ్యత్స్వరూపాఖిలాం
పద్మాక్షీం హనుమద్గిరీంద్రనిలయాం వందే శివాంశాంకరీం ॥

సౌఃకారాంబుజ సంస్థితాం భగవతీం సద్వస్తుజ్ఞానప్రదాం
సర్వాంతఃకరణస్వరూపవిభవాం సర్వేప్సిత ప్రాపిణీం
నిర్వాణార్థి జనాశ్రితా గుణమయీం నిత్యాం నిదాఘోజ్జ్వలాం
పద్మాక్షీం హనుమద్గిరీంద్రనిలయాం వందే శివాంశాంకరీం ॥

సర్వాభీష్ట ఫలప్రదాం సుజన సంసేవ్యప్రభాభాసురాం
సామ్రాజ్ఞీం కరుణామయీం భగవతీం కల్యాణ సందాయినీం
సౌఖ్యం ధైర్యైశ్వర్య వివర్ధనీం పరశివాం హ్లాదైక సద్రూపిణీం
పద్మాక్షీం హనుమద్గిరీంద్ర నిలయాం వందే శివాంశాంకరీం ॥

యోగక్షేమ విధాయినీం గురుముఖీం యోగీంద్ర హృద్వాసినీం
నాగానంద వపుర్ధరాం భవపతీం నాదప్రియాం వాదినీం
నానాయోని ప్రవర్తమాన రుచిరాం నారాయణీం నందినీం
పద్మాక్షీం హనుమద్గిరీంద్ర నిలయాం వందే శివాంశాంకరీం ॥

బాలార్కానల భాసురాం పంచితాం ఫాలస్థనేత్రోజ్జ్వలాం
కారుణ్యామృత వార్షిణీం కరతలైః పాశాంకుశౌ బిభ్రతీం
కల్యాణీం కమనీయకాంతి విభవాం కాత్యాయనీం కామినీం
పద్మాక్షీం హనుమద్గిరీంద్రనిలయాం వందే శివాంశాంకరీం ॥